ఓమ్.

శ్రీసద్గురుచరణారవిందాభ్యాంనమోనమః.

# బ్రహ్మానంద చంద్రిక.

కటికనేని రామయకవి ప్రణీతము.

పురాణం రామచంద్రశాస్త్రిచేఁ బరిశోధితము.

మహారాజరాజశ్రీ
రాజా వాసిరెడ్డి శ్రీచంద్రమౌళీశ్వర ప్రసాద్ బహదర్
మన్నెసుల్తాన్ చింతలపాటివంటు జమీందార్
సర్ దేశముఖ్ మన్నెవార్ సర్కార్
ముర్తుజాన్నగర్ వగైరా దొరవారిచేఁ
ప్రకటితము.

మాహిష్మతీముద్రాక్షరశాలన్
ముద్రితము.

విలాసము

ముక్త్యాల.
1915.

# పీఠిక.

ఈగ్రంథము మాప్రభువు లగుమహారాజరాజశ్రీ రాజా వాసిరెడ్డి శ్రీచంద్రమౌళీశ్వరప్రసాద్ బహదర్ మన్నెసుల్తాన్ చింతలపాటివంటుజమీందార్ సర్ దేశముఖ్ మన్నెవార్ సర్కార్ ముర్తుజాన్నగర్ వగయిరాదొరవారిస్వకీయశ్రీసరకేసరిపుస్తకభాండాగారమున నుండెను వ్రజదంష్ట్రిపుంబురు వాకపరి దనపరిమాణము దీనిపై నొనరించెను దీనిని ముద్రింపించుటకు మాప్రభువులతో మనవిచేసికొంటిని. సెలవొసంగిరి. యచ్చునకుఁ దగునట్లు వ్రాసి యిచ్చి ప్రమాదపతితస్ఖాలిత్యములఁ జేనయినంతవఱకు సవరించితిని. ఈగ్రంథమును రచించినది కటినేనిరామయ. ఈకై సరుఁడు పద్మనాయకకులజుఁడు చెఱుకునూళ్లగోత్రుఁడు సూరయకును బుచ్చమకును బుత్రుడు. ఈసంగతు లితనికువలయానందప్రకాశమువలనఁ దెలియవచ్చుచున్నవి. ఇది ముద్రితము. ఈకవిచరిత్రమును రావు బహదర్ కందుకూరి వీరేశలింగంపంతులుగారు వ్రాసిరి కాని కువలయానందప్రకాశమునుమాత్రమే రచియించినట్లు వ్రాసిరి. మనయీగ్రంథమును చేర్కొనలేదు. ఇది వారికి లభింపక పోవచ్చును. ఈగ్రంథమునఁ గవి తనవంశచరిత్రము నేమియు వ్రాయలేదు గద్యయందుమాత్రము "సూరయసుధీవరపుత్ర" అని మాత్రము వ్రాసికొనెను. ఇందలిమూఁడవపద్యముంబట్టి యీకబ్బపు సేతరి 1 కంజాక్షవిగ్రహస్తవము 2 శంకరమహిమ 3 శాంభవీలీల 4 గణపతిస్తుతి 5 చక్రస్తవము 6 శారదావినుతి 7 కృష్ణవిలాసము 8 బ్రహ్మజీవబోధ 9 కువలయానందప్రకాశము 10 దశావతారములు రచియించినట్లు తెలియ నగుచున్నది. ఇందుఁ దొమ్మిదవదిగాఁ జేర్కొనఁబడినకువలయానందప్రకాశము ము

ద్రిత మయియే యున్నదని యిదివఱకే వ్రాసితిని. మిగిలిన గ్రంథము లెప్పు డేరికంటఁ బడ నున్నవో తెలియదు. ఈగ్రంథము లన్నియుఁ జిన్నచిన్నవి యని యూహింప నగుచున్నది. చిన్నవియో పెద్దవియో పదిగ్రంథముల నేకయీసరుఁడు రచియించె నని తెలిపి పదునొకండవది యగుమనయీబ్రహ్మానందచంద్రికఁ దనప్రథమగురుఁడగుకనకాద్రిపండితునియాజ్ఞానుసారముగ రచియింపఁబడెనని కవియేనుడివికొనియున్నాఁడు. అక్కలంకరంగార్యునితోడ్పాటుచేఁ గువలయానందప్రకాశమును రచియింపఁ గడఁగితినని తద్గ్రంథమున వ్రాసికొనెను. ఆకనకాద్రి పండితుఁ డెచ్చటివాఁడో యీరంగార్యుఁ డెచ్చటివాఁడో మన వెలమదొర యెచ్చటివాఁడో విస్పష్టముగఁ దెలియుట లేదు. నూటయేబదిసంవత్సరములకుఁ బూర్వపువా రని యొకవాడుక గలదు. ఈగ్రంథమున వ్రేలుచూపఁ దగినస్థలములు కానరాలేదు. అవి కవిదోషంబులని పనియే యన వీలుండదు. రెండుమూఁడుప్రతులు సంభవించినచో నెట్లుండునో గ్రంథస్థవిషయము గొనియాడఁ దగిన దశలచే వానిజోలికి నేను బోలేదు. దిగంతవిశ్రాంతయశోవిశాలురగుమాప్రభువు లీగ్రంథమును ముద్రింపించి యాంధ్రలోకమునకు మహోపకార మొనర్చి రనుటకు సందియము లేదు. శ్రీవారికిఁ బరమేశ్వరి యాయురారోగ్యపుత్రపౌత్రాభివృద్ధి నొసఁగి రక్షించుఁగాత.

ఇట్లు,

పురాణం రామచంద్రశాస్త్రి.

ముక్త్యాల (సంస్థానము.)

ఓమ్.

శ్రీసద్గురుచరణారవిందాభ్యాంనమోనమః।

# బ్రహ్మానందచంద్రిక.

శా. శ్రీలీలారసవారిధిన్ స్తనఘన♦స్థేమోరుకుంభప్లవ
శ్రీలాభంబునఁ గ్రీడ సల్పి వళిపీ♦చీమాలికాశాలిరో
మాళీశైవలవల్లికాంచదువర♦న్యగ్రోధపత్రోల్లస
త్ప్రాళిన్ వేడుకఁబవ్వళించినపర♦బ్రహ్మంబు నన్ బ్రోవుతన్.

వ. అని యిష్టదేవతాధ్యానంబు సేయుచున్న సమయంబున. 2.

తే. ప్రథమగురుఁ డైనకనకాద్రి♦పండితుండు
వచ్చి ననుఁ గాంచి సత్కృతుల్ ♦ వడసి యొద్ది
యోని సత్కృతి రచియింపఁ ♦ బూను మనిన
నింపు మీఱంగ వినయోక్తి ♦ నిట్టు లంటి. 3

సీ. కంజాక్షుదివ్యమం♦గళవిగ్రహస్తవం
బంచితోక్తుల రచి♦యించినాఁడ
క్షేమంకరం బైన♦ శ్రీరమాసౌందర్య
మంజరిఁ జేసితి ♦ రంజితముగ
శంకరమహిమయు ♦ శాంభవీలీలయు
గణపతిస్తుతియుఁ జ♦క్రస్తవంబు
శారదావినుతి కృ♦ష్ణవిలాసమును బ్రహ్మ
జీవబోధయుఁ దగఁ ♦ జెప్పినాఁడ

తే. కువలయానంద మాంధ్రోక్తిఁ ♦ గూర్చినాఁడ
నుడివితి దశావతారముల్ ♦ నూత్నఫణితి
నమర శ్రీహరిచరణాంబు♦జములచెంతఁ
జేరి నాచిత్త మితరేచ్ఛఁ ♦ జెంద దెపుడు. 4

వ. అనిన విని మదీయాభిప్రాయంబుఁ దెలిసి యవ్విద్వాంసుం డి ట్లనియె నైనను నీవు పరిపూర్ణపరబ్రహ్మానందప్రతిపాదకం బైనయొక్కప్రబంధంబు విరచించిన నామనంబు పరితృప్తిం బొందెడి నని యానతిచ్చిన నేనును గుతూహలాయత్తచిత్తుండ నై శంకరకుమారసంవాదరూపం బైనబ్రహ్మానందచంద్రిక యనుగ్రంథంబు సంగ్రహంబుగాఁ జేయం బూనితిఁ దత్క్రమం బెట్టి దనిన. 5

శా. జ్ఞానానందమయున్ నిరంకుశనిజా♦జ్ఞారూపవేధున్ సదా
ధ్యానాసక్తమనస్కు నద్రివరక♦న్యాలింగితార్ధాంగు నీ
శానున్ సర్వసురర్షిసంఘసహితున్ ♦ షాణ్మాతురుం డంకస
స్థానంబొప్పఁగభక్తి మ్రొక్కి పరమా♦నందంబుతో నిట్లనెన్.

వ. దేవా విశ్వనిర్మాణప్రకారంబు నా కెఱింగింపవే యని విన్నవించిన నయ్యిందుశేఖరుం డమందానందకందళితహృదయారవిందుం డై స్కందున కి ట్లనియె. 7

సీ. అవ్యయం బాదిమ♦ధ్యాంతశూన్యం బైన
తత్త్వంబు సృష్టిత♦త్పరతఁ జేర్చి
కనుఁగొని త్రిగుణాత్మ♦కత్వంబుచే మించి
మాయ యనా నొప్పు♦మహిత మైన
ప్రకృతినిఁ గాంచి త♦త్ప్రకృతితత్త్వంబుచేఁ
దనర మహత్తత్త్వ♦మును సృజించి

దాన నహంకార◆తత్త్వంబుఁ గావించి
తత్త్వత్రయైకసా◆ధనము నగుచుఁ

తే. దా నుపాదానకారణ◆త్వము వహించి
తనదులీలార్థ మై తన్నుఁ ◆ దా సృజించి
విశ్వ మనుపేర వెలసె స◆ద్విశ్వమందుఁ
దాను దనలోన విశ్వంబుఁ ◆ దవిలియుండు. 8

ఆ. అట్టి బ్రహ్మతత్త్వ◆మం దఖిలంబును
బుట్టుఁ బెరుఁగు మఱియు ◆ గిట్టుచుండు
నబ్ధిఫేనబుద్బు◆దాదికంబును బోలి
కానఁబడును వెసఁ ద్రి◆కాలములను. 9

వ. అట్టిసర్గప్రకారం బెట్టి దనిన. 10

తే. అయ్యహంకారతత్త్వంబు ◆ నెయ్య మెసఁగ
సాత్త్వికము రాజసము తామ◆సం బనంగఁ
ద్రివిధ మై మించి చిత్కళా◆దీప్త మగుచు
సర్గసాధన మయ్యె ని◆సర్గమహిమ. 11

తే. సాత్త్వికాహంకృతిస్ఫుర◆చ్ఛక్తి వలనఁ
గడఁగి మనమును దేవతా◆గణము వుట్టె
రాజసాహంకృతిప్రకా◆రంబువలన
దశవిధేంద్రియనివహ ము◆త్పన్న మయ్యె. 12

క. మహిత మగుతామసాఖ్యా
భిహితాహంకారమున వి◆భేద మొనర్పన్
విహితముగ నుద్భవించెను
రహి శబ్దస్పర్శరూప◆రసగంధంబుల్. 13

తే. మఱియు నయ్యాత్మశబ్దత♦న్మాత్రివలన
గగన మనియెడిభూతంబు ♦ నెఁగి సృజించె
గగనమును గాలమాయాను♦గతము నగుచు
స్పర్శతన్మాత్రిమునఁ బ్రభం♦జను సృజించె. 14

తే. పవనుఁడును రూపతన్మాత్ర♦బలమువలన
నలరఁ దేజంబుఁ గల్పించె ♦ నాత్మశక్తి
మఱియుఁ దేజంబును రసత♦న్మాత్రివలన
నప్పులను నోలిఁ బుట్టించె ♦ నొప్పు మీఱ. 15

క. సలిలంబు కాలమాయా
కలితం బై పురుషదృగ్వి♦కాసస్ఫురణన్
లలిత మగుగంధగుణమునఁ
గలిగించెను బృథివి నపుడు ♦ కడు నలుగానన్. 16

సీ. గగనంబునకు శబ్ద ♦ మొగి గుణం బనిలున
కలరు శబ్దస్పర్శ♦ములు గుణములు
రుచిరశబ్దస్పర్శ♦రూపంబు లగ్నికి
నవియు రసంబును ♦ నంబువులకు
రూఢి శబ్దస్పర్శ♦రూపరసంబులు
గంధంబు నవనికిఁ ♦ గలగుణములు
కాలమాయాశక్తి ♦ కలితు లై మహదాద్య
భినివేశచిత్తు లై ♦ వెలయుచుండ్రు

తే. దేవతలు బ్రహ్మచిత్కళా♦దీప్తు లగుచు
నగుటఁ బరికించి చూడ నీ♦యఖిలవిశ్వ
మతులమహదాదిభూతని♦ర్మితము నగుచు
బ్రహ్మలీలావినోదార్థ ♦ పరత వెలిఁగె. 17

తే. అట్టిసర్గంబు ప్రాకృతం • బనఁగ వైకృ
తం బనఁగను ద్వివిధ మయి • తనరుచుండుఁ
బ్రాకృతంబును షడ్విధా • ప్రాప్తిఁ జెలఁగు
నదియు నెట్లన్న వివరింతు • నతిముదమున. 18

సీ. అందు మహత్తత్త్వ • మాద్య మహంకార
సర్గంబును ద్వితీయ • సర్గ మయ్యె
గంధాదితన్మాత్ర • గణశక్తివలనఁ బృ
థివ్యాదిసృష్టి తృ • తీయ మయ్యె
జ్ఞానేంద్రియోత్పత్తిఁ • బూని కర్మేంద్రియ
సర్గంబును చతుర్థ • సర్గ మయ్యె
సాత్త్వికాహంకార • సంజనితం బైన
యయి మనోమయసృష్టి • పంచమంబు

తే. మఱియు నావృతివిక్షేప • మహితసృష్టి
సరవి షష్ఠంబు ప్రాకృత • సర్గ మిట్లు
షడ్విధం బయ్యె వైకృత • సర్గసరణి
త్రివిధ మై యుండు నెట్లనఁ • దేటపఱతు. 19

వ. అందు మహత్తత్త్వంబు ప్రథమసర్గంబు పరబ్రహ్మసకాశం బైనగుణవైషమ్యంబు నొంది ద్రవ్యజ్ఞానక్రియాశ్రియం బైనయహంకారసర్గంబు ద్వితీయసర్గంబు తామసాహంకారజనితంబు లైనశబ్దస్పర్శరూపరసగంధంబు లనుపంచతన్మాత్రలవలన ద్రవ్యశక్తియుక్తం బైనపృథివ్యాదిభూతసర్గంబు తృతీయంబు రాజసాహంకారంబువలన జ్ఞానశక్తియుక్తంబు లైనశ్రోత్రత్వక్చక్షుర్జిహ్వాఘ్రాణంబులును క్రియాశక్తియుక్తంబు లైనవాక్పాణిపాదపాయూపస్థలును ననుదశవిధేంద్రియసర్గంబు

చతుర్థసర్గంబు సాత్త్వికాహంకారజనితం బైనమనోమయ
సుమనోగణసర్గంబు పంచమసర్గంబు జీవలోకంబునకు బుద్ధి
కృతంబు లైనయావరణవిక్షేపంబులఁ జేయుతామససర్గంబు
షష్ఠసర్గం బింక వైకృతసర్గంబు త్రివిధం బయ్యె నెట్లనిన. 20

సీ. పుష్పశూన్యంబు లై ♦ పొసఁగువనస్పతుల్
సఫలపాకంబు లో♦షధులు మఱియు
నారోహణాపేక్ష ♦ నలరినలతలును
ద్వగ్సారయుతము లౌ♦వంశములును
ముదిరి కాఠిన్యంబు ♦ మొనసి యారోహంబుఁ
గోరినయట్టియ♦వ్వీరుధములు
పుష్పయుక్తంబు లై ♦ పొదలి ఫలంబుల
విఱ్ఱవీఁగుచు నున్న♦వృక్షములును
తే. నెనర నవ్యక్తచైతన్య♦యుతము లూర్ధ్వ
రేతములు గాఢతరత మో♦భూతములును
నైనపర్వతములు గూడ ♦ నడఁగి మెఱయ
స్థావరంబులు సప్తమ♦సర్గ మయ్యె. 21

క. మఱి యష్టమ సర్గం బగు
వరతిర్యక్సర్గ మరయ ♦ వసుధాస్థలిపై
నిరువదియెనిమిదిభేదము
లరుదుగఁ బ్రాపించి యుండు ♦ నవి వివరింతున్. 22

తే. రురుమహిషమేషహరిణసూ♦కరము లుష్ట్రి
వృషభగవయాదికాఖ్య మౌ♦ద్విశఫసపక
మశ్వతరఖరశరభఖ♦డ్గాశ్వచమర
ముఖ్య మగునేకశఫషట్క♦మును మఱియును. 23

సీ. సింహగోలాంగూల♦సింధురగోమాయు
శార్దూలభల్లూక♦శల్యశశక
కపిబిడాలశ్వవృ♦కముఖపంచనఖాభి
ధానధాత్రీచర♦ద్వాదశకము
కంకగృధ్ర శ్యేన♦కాకబర్హి మరాళ
చక్రవాకోలూక♦సారసాది
ఖచరపంచనఖప్రి♦కరమును మకరాది
పంచనఖాన్వితాం♦భశ్చరములు
తే. మైథునాహారనిద్రాప్రతి♦మాత్రనిష్ఠ
గలిగి దీర్ఘానుసంధాన♦గరిమ లేక
కడఁగు నివి తిర్యగాఖ్యస♦ర్గ మిది యెనిమిఁ
దవది మానవసర్గంబు ♦ నవమ మయ్యె. 24

వ. ఇవ్విధంబునఁ బ్రాకృతసర్గభేదంబు లాఱును వైకృత సర్గభేదంబులు మూఁడును గూడి నవవిధంబు లగుసర్గంబులు నీ కెఱింగించితి నింక దశమం బగుదేవసర్గం బష్టవిధం బై యుండు నది యెట్టి దనిన. 25

సీ. వివరింపఁగా సర్వ♦విబుధసర్గం బొండు
మఱియును బిత్రసర్గ ♦ మెఱుఁగ రెండు
మునుకొని సురసృష్టి ♦ మూఁడవ దై యుండు
నప్సరోగంధర్వ ♦ లరయ నాల్గు
యక్షరక్షస్సర్గ ♦ మైదవ దై యొప్పు
భూతపిశాచముల్ ♦ పొసఁగ నాఱు
శోభించుచారణ♦సిద్ధవిద్యాధర
సర్గంబు సప్తమ♦సంజ్ఞఁ దనరు

తే. నవని( గింనరకింపురు♦షాదిసర్గ
మష్టమం బగు( దెలియ ని ♦ ట్లష్టవిధము
లైనయి ద్దేవసర్గంబు♦తోన గూడి
పర(గు దశవిధ మగుచు నీ♦బ్రహ్మసృష్టి. 26

వ. అనిన విని యివ్విశ్వంబు విరాట్పురుషునకు విగ్రహం
బె ట్లయ్యె నని కుమారుం డడిగిన జగజ్జనకుం డైనయప్ప
రమేశ్వరుం డి ట్లనియె. 27

సీ. గగనంబు శీర్షంబు ♦ కంజాప్తచంద్రులు
నేత్రముల్ దిక్కులు ♦ శ్రోత్రములును
వదనంబు వహ్నియు ♦ వాక్కులు వేదముల్
భుజము లింద్రాదులు ♦ భూరికుక్షి
యంబుధుల్ గిరులు శ♦ల్యంబులు భూతలం
బంఘ్రులు ప్రాణంబు ♦ లనిలసమితి
రోమసంఘంబు భూ♦రుహము విధుం(డు మనం
బలనిమేషంబు ల♦హర్నిశములు

తే. జలము రేతంబు మందహా♦సంబు మాయ
జలదము శిరోజములును దం♦ష్ట్రలు యముండు
గా(గ నివ్విశ్వ మెల్ల వి♦గ్రహము నగుచుం
బర(గుచుండును నవ్విరా♦ట్పురుషునకును. 28

వ. అని చెప్పిన విని యీప్రపంచంబు సత్యం బనియు నసత్యం
బనియును సత్యాసత్యం బనియును జెప్పుదు రది యె ట్లని
తనయుం డడిగిన నధ్యారోపాపవాదపూర్వకంబుగా( దండ్రి
యి ట్లనియె. 29

తే. రహిని శుక్తికయందున • రజత మట్లు
రజ్జువందునఁ దోఁచుస•ర్పంబుపగిది
మరుమరీచిక సలిలంబు•మాడ్కి నరయ
బ్రహ్మమందున విశ్వ ము•ద్భవము నొందె. 30

తే. సర్పరజతాంబుబుద్ధి య•సత్య మయ్యు
రజ్జుశుక్తిమరీచికల్ • రమణ సత్య
మైనమాడ్కి సి జగదధి•ష్ఠాన మాత్మ
సత్య మారోపితజగం బ•సత్య మయ్యె. 31

తే. బ్రహ్మమందున నీజగ•ద్భ్రాంతి దగిలెఁ
బటుతరానాద్యవిద్యాప్ర•భావమునను
విద్యచే భ్రాంతి యడఁగిన • విభుఁడు నెలయు
రజతబుద్ధి యడంగిన • రంగమట్ల. 32

క. కావున మాయామయ మగు
నీవిశ్వంబంత నేతి • నేతి యటంచున్
ధీవిధిఁ బ్రతిషేధించిన
భావిత మై శేష మొక్క•బ్రహ్మమె వెలయున్. 33

వ. అనిన విని పుత్రిశేఖరుం డిట్టివిశ్వంబునందు శాశ్వతం బైనపరబ్రహ్మం బేరూపంబునఁ బరిపూర్ణం బై యుండు నని యడిగినఁ జంద్రశేఖరుం డి ట్లనియెఁ బృథివిలో స్వేదజాండజోద్భిజ్జరాయుజంబు లనెడిచతుర్విధజంతునివహమందు బ్రహ్మంబు సచ్చిదానందరూప మంది యుండును జెప్పెదు నవ్విధంబు.

క. ద్రవ్యజ్ఞానక్రియలను
దివ్యం బగుభేదసరణిఁ • ద్రివిధం బగు నా

భవ్యానందం బంతట
భావ్యం బగు బ్రహ్మబోధ • పరునకు మదిలో. 35

వ. అది యె ట్లంటేని మశకమక్షికాశలభవృశ్చికక్రిమిదంశాదు లైన స్వేదజంబులును శుకపికబకశారికాకలహంసకంకకలవింకకారండవకాకోలూకకాకోదరాదు లయినయండజంబులును దరుగుల్మలతాపర్వతాదు లయినయుద్భిదంబులును దిర్యగ్మనుష్యాదికంబు లయినజరాయుజంబులును నిరవధికనిరతిశయనిరుపమపరమపరబ్రహ్మానందాశ్రయంబు లైనద్రవ్యజ్ఞానక్రియానందంబులచేతఁ బరిపూర్ణంబు లై యుండు నది యెట్లనిన వేఱువేఱ వివరించెద. 36

తే. అరయ నిజభక్షణాద్యర్థ • మగుపదార్థ
మెద్ది యైనను బ్రాపించె • నేని ముదము
నొందుఁ గావున స్వేదజ • బృందమునకు
ద్రవ్యజానంద మూహింపఁ • దగును జగతి. 37

క. మిథునస్థితిఁ గైకొని కడు
నిధువనకర్త్రాదికముల • నెఱి మోదింపన్
బుధు లెల్ల స్వేదజములకుఁ
బృథివిఁ గ్రియానందగరిమ • ప్రియ మండ్రు దగన్. 38

క. అనుకూలప్రతికూలము
లను దెలిసియు లాభవర్జ • లక్షణములఁ జే
కొని ముద మందుట సంవి
జ్జనితానందంబు స్వేద • జంబుల కలరున్. 39

క. ఈకరణి నందజాదుల
కాకలితం బగుచు నుండు • నానందంబున్
బ్రాకటగతి నుద్భిత్తుల
కేకరణిన్ గలుగు నన్న • నేర్పఱతు వెసన్. 40

వ. తరుగుల్మలతాజాలంబులు నిదాఘసమయంబునఁ బ్రచండతరచండకరకిరణమండలంబులన్ గ్రాఁగి ప్రావృషేణ్యపయోధరధారాసారసంపాదితసలిలసంపాతరూపద్రవ్యలాభంబున వికసితంబు లై పల్లవకుసుమఫలభరితంబు లగుచు నానందించుఁ గావున విద్వాంసులు వీనికి ద్రవ్యానందంబు గల దని యూహించి రిదియునుం గాక పరాపశ్యంతీమధ్యమావైఖరీరూపంబు లైనచతుర్విధవాగ్వ్యాపారంబులయందుఁ బ్రథమం బగుపరారూపవాగ్వ్యాపారంబు గలుగుటం జేసియుఁ "దరుగుల్మలతాదీనామంతస్సంజ్ఞా స్త్యసంశయ" మనెడిశాస్త్రంబువలనను భగుక్షితసారోహణాదిహేతుబలంబునను స్థావరంబుల కాధ్యాత్మికవాయుసంబంధంబు గల దని నైయాయికాదిశాస్త్రజ్ఞాను లనుమేయించుటం జేసి జ్ఞానానందంబు గలిగి యుండు భేదనచ్ఛేదనోత్పాటనప్రతిరోపణాదిప్రతికూలానుకూలక్రియాకలాపంబువలన ఖేదమోదాద్యనురూపకంబు లైనపరిమ్లానతావికసనాదిరూపధర్మంబులు గలుగుటం జేసి క్రియానందంబునుం గల్గియుండుఁ గావున మఱియును. 41

తే. తుహినశైలాదిపర్వత • స్తోమమునకు
వసుధ నధిదేవతానుభా • వంబుకలిమిఁ

త్రివిధ మైనట్టియానంద • దీప్తమహిమ
దెల్ల మై యుండు లోకము • దెల్ల నెపుడు. 42

సీ. ద్రవ్యజానందంబు • తామసంబును శైవ
మాధిభౌతికమును • నై పౌసంగు
నరయ జ్ఞానానంద • మవని సాత్త్వికము వై
ష్ణవము నాధ్యాత్మిక • సంజ్ఞ నొప్పు
నాక్రియానందంబు • నటు రాజసము బ్రాహ్మ
మాధిదైవిక మగు • నట్టియవియె
త్రివిధ వేదంబులు • త్రివిధ కాలంబులు
త్రివిధశక్తులు నయ్యుఁ • దేజరిల్లు

తే. సర్గపాలనసంహార • సరణి గలిగి
ఘనమకార ముకార మ • కార మగుచుఁ
ద్రిప్రకారంబులను జెంది • త్రిజగములను
సచ్చిదానందజాంశ లై • యచ్చుపడియె, 43

వ. ఇట్లు నిత్యంబును సత్యంబును నైనయాపరబ్రహ్మంబు త్రివిధానందరూపంబునఁ ద్రివిష్టపంబులయందును బరివ్యాప్తం బై యుండు నని చెప్పిన విని మహేశునుండు బ్రహ్మం బేలక్షణంబు గలయది యని యడిగిన మహేశ్వరుం డిట్లనియె. 44

తే. లలిని బ్రహ్మకును దటస్థ • లక్షణంబు
విశ్వజన్మాది హేతువు • వెలయుచుండు
సచ్చిదానందరూపత్వ • సంజ్ఞ గలిగి
లలిత మై యొప్పును స్వరూప • లక్షణంబు. 45

వ. అని చెప్పిన గుహాఖ్యంబు గొందఱు బ్రహ్మజీవులకు భేదం బనియును గొందఱు అభేదం బనియును జెప్పెద రిది నిస్సంశయం బుగా దయాళుండ వైనా కుపదేశింపు మనిన మహేశ్వరుం డిట్లనియె, 46

క. "అయమాత్మాబ్రహ్మ" యటం
చయనిష్ఠన్ బ్రత్యగీశ్వరాభేదగతిన్
ద్రయి బోధించుటవలనన్
బ్రియము మగు జీవేశ్వరుల కభేదము పుత్రా. 47

వ. మఱియును దత్త్వమసి యను పదత్రయవిశిష్టం బైనమహావాక్యంబునందుఁ దత్పదవాచ్యార్థం బగుసర్వజ్ఞత్వాదిధర్మవిశిష్టుం డైనయీశ్వరునకును త్వంపదవాచ్యార్థం బగుకించిద్జ్ఞత్వాదిధర్మవిశిష్టుం డైనజీవునకు నసి యనుక్రియాపదంబు వలన నభేదాన్వయంబు బాధితం బగుటం జేసి "తాత్పర్యానుపపత్తిర్వా న్వయానుపపత్తిర్వా లక్షణాబీజం శక్యసంబంధాహి లక్షణా" యనియెడిసకలశాస్త్రనిగదితన్యాయంబువలన లక్షణ కల్పనీయం బగు నందు "గంగాయాం ఘోషః క్షేత్రిణో యాంతి" త్యాదివాక్యంబులయందునుంబోలె జహల్లక్షణాజహల్లక్షణల కవకాశంబు లేదు గావున "సోయం దేవదత్త" ఇత్యాదివాక్యంబులందునుం బోలి యిమ్మహావాక్యంబునందు భాగత్యాగలక్షణాపరనామకం బైనజహదజహల్లక్షణాబలంబున నవ్వాచ్యార్థంబులన్ బరిత్యజించిన లక్ష్యార్థంబులకు నభేదాన్వయం

బు సంభవించుఁ గావున నిమ్మహావాక్యార్థం బఖండాకారకూ
టస్థచిన్మాత్రం బె పరిశేషించుటం జేసియు "నేకమేవాద్వితీయం
బ్రహ్మే"త్యాదిశ్రుతివచనాంతరతాత్పర్యపర్యాలోచనంబువల
నను బ్రత్యగాత్మపరమాత్మల కభేదం బె పరమార్థం బని చెప్పి
వెండియు నిట్లనియె. 48

క. బింబప్రతిబింబన్యా
యంబునఁ దదభేదసిద్ధి • యగు నెల్లిననై
యంబరమణికిన్ దత్ప్రతి
బింబమునకు నరయ నాత్మ • భేదము గలదే. 49

తే. ప్రకృతిసంబంధవశమునఁ • బ్రత్యగాత్మ
యనఁగ విలసిల్లె నాపర•మాత్మ నిజము
చిత్యవచ్ఛిన్నతానవ•చ్ఛిన్నతాప్తి
నాత్మఁ దెలిసిన భేదం బ•పాస్త మగును. 50

క. శ్రుతియుక్త్యనుభవవాగ్వ్యా
పృతులన్ భేదంబు మఱియు • భేదాభేదం
బతిఘనీతిన్ బ్రతిహత మగు
క్షితిపైఁ బరపటు మిది వి•చింత్యము తనయా. 51

వ. అది యెటనిన "ద్వాసుపర్ణే"త్యాదిశ్రుతివచనంబులవలనఁ గొం
దఱు జీవేశ్వరులకు భేదం బుపపాదింతు రవ్వచనంబులు "బ్ర
హ్మవిద్బ్రహ్మైవభవతి బ్రహ్మాహమస్మి సోహ" మిత్యాద్య
నుపాధికభేదోపపాదకనిరవకాశప్రబలబహుళవేదాంతవచననిచ
యంబుచే బాధ్యమానంబులై నకతంబున నౌపాధికభేదప్రతిపా
దనతాత్పర్యసమన్వితంబు లగుటవలనను జీవుండు స్వరూపంబువ
లన విచారింప నిత్యుండును సచ్చిన్మాత్రుండును నగుటం జేసి

యు ఘటపటంబులకుంబోలె భేదంబు పొసంగనేరదు మఱి
కొందఱు భ్రమరకీటాదులకుంబోలె భేదాభేదంబుఁ జెప్పెదరు
తత్ప్రతిపాదకవేదవచనంబులు లేకుండుట జీవేశ్వరులకు స్వరూ
పభేదంబు శ్రుతిబోధితంబు గాకుండుటవలనను భ్రమరకీ
టంబులకు మొదట స్వరూపభేదంబు దృష్టం బగుటంజేసియు
దృష్టాంతదార్ష్టాంతికంబులకు వైషమ్యంబు గల్గుటవలనను మ
ఱియు నా భ్రమరకీటస్వభావంబు తాదృశం బగుట నాదృష్టాం
తం బంతట సంభవింపకుండుటంజేసి యిచ్చట నుపపాదింప న
ర్హంబు గాదు గావున భేదాభేదంబు సంభవింప దదిగాన నభేదం
బే పరమార్థం బని యెఱుంగునది. 52

చ. అన విని తారకాంత మద•నారికి నిట్లను దేవ దేవతా
సన భవదీయసత్కృప ని•వారణసర్వవిశేషముల్ మనం
బున విదితంబు లయ్యెఁ బరి•పూర్ణరసస్థితిఁ జెందనింక నై
ననుభవమార్గలక్షణము•నా కెఱిఁగింపుము నెమ్మి నింపునన్.

వ. అనిన శివుం డిట్లనియె. 54

క. సృష్టిఁ గలజంతుజాలం
బిష్టానిష్టాప్తివర్గ•నేచ్ఛావిధులన్
దుష్టి నివర్తించుటను వి
శిష్టానందంబు గల్గు•సిద్ధము తెలియున్. 55

తే. ఇష్టసంప్రాప్త్యనిష్టని•వృత్తిపూర్వ
కంబుగా సుదృఢప్రయ•త్నంబు నొనర్చ
సృష్టియందున నానంద•సిద్ధిఁ గోరి
ప్రాణిమాత్రంబు కార్యమా•త్రంబు సేయు. 56

వ. ఇష్టప్రాప్త్యనిష్టపరిహారంబులకై యీలోకంబుల నేప్రాణియై
యినను బ్రయత్నపూర్వకంబుగాఁ గర్మంబు సేయునెడ దైవ
యోగంబున ననిష్టంబు సంభవించిన నెవ్విధంబున నానందంబు
నొందు నని యంటివేని. 57

ఉ. ఇష్టముఁ గోరియైనియు న•నిష్టముఁ బాపఁ దలంచి యైన నీ
విష్టపమందుఁ గర్మములు•వే యొనరించెడివేళ నొక్కెడన్
దిష్ట ననిష్టముం గదుర • ధీరహితుం డొగి ఖేదమొందు నా
శిష్టుఁడు ఖేదమొందఁ డిది • సిద్ధము వారలకంతరం బగున్.

తే. పూని యజ్ఞుఁడు సమదృష్టి • లేనికతన
ఖేదమోదంబులను జెందుఁ • గృతి యొనర్చి
ప్రాజ్ఞుఁ డురుపూర్ణభావసం•పత్తివలన
ఖేదమును వీడి నిత్యప్ర•మోద మందు. 59

వ. మఱియు ననిష్టపరిహారపూర్వకేష్టావాప్తిం గోరి జంతు
మాత్రంబు కార్యమాత్రంబుఁ జేయు నని యానతిచ్చితిరి
లోకంబునఁ గొందఱాత్మనాశార్థం బై విషభక్షణాదికర్మం
బు లొనర్చెద రది యెట్లని క్రౌంచభేదనుం డడిగినఁ బంచ
వదనుం డి ట్లనియె. 60

తే. అవని రోగాద్యనిష్టసం•ప్రాప్తి యైనఁ
దన్నివృత్తినిఁ గోరి త•త్కర్మఁ జేయుఁ
గాన నానందసంప్రాప్తి•కాంక్షఁ జేసి
పరఁగ నేకర్మ మైనను • బ్రాణి సేయు. 61

వ. కావున స్థావరజంగమాత్మకం బైన యీప్రపంచంబున నా
నందంబు పూర్వోక్తప్రదన్యజ్ఞానక్రియారూపంబు లైనత్రిప్రకా
రంబులఁ బూర్ణం బై యుండు నీయానందంబులు నిత్యసత్యసచ్చి

దానందంబులనియును దలంచి "సర్వంఖల్విదంబ్రహ్మ" తా శ్రుతితాత్పర్యజ్ఞానబలంబున నెద్దియైన నింద్రియంబులకు విషయంబగు నది సర్వంబును దర్శనశ్రవణమనననిదిధ్యాసలవలన లబ్ధంబైనపూర్ణభావంబున బ్రహ్మంబును భావించి "ఆనందో బ్రహ్మేతి వ్యజానాత్ నిత్యం విజ్ఞాన మానందంబ్రహ్మ, ఆనందమయోభ్యాసా" దిత్యాదిశ్రుతిసూత్రతాత్పర్యపరిజ్ఞానబలంబున నెద్దియైన ననుభూయమానం బగు దాని నెల్లను బ్రహ్మనందంబుగాఁ దెలిసి సంపూర్ణసమాధిసంపన్నుండై బ్రహ్మానందమయుండైనయతండే జీవన్ముక్తుం డని యనంబడు నదియే జీవన్ముక్తి యని చెప్పంబడు నని చెప్పిన విని సుబ్రహ్మణ్యదేవుండు బ్రహ్మణ్యదేవున కి ట్లనియె. 62

క. జీవన్ముక్తున కింక నిం
కేవిధిఁ దను వుండు నుండు • నేనియుఁ గర్మం
బేవిధిఁ జేయును జేసిన
నేవిధి బంధంబు దొలఁగు • నెఱిఁగింపఁ గదే. 63

వ. అని శరజన్ముం డడిగిన శంకరుం డి ట్లనియె వత్సా జీవన్ముక్తున కాగామిసంచితకర్మంబులు నశియించును ప్రారబ్ధం బవశ్యమనుభవనీయం బైనకతంబునఁ దత్పర్యంతంబు దేహం బుండియుఁ దదభిమానంబు లేకుండుటవలన దగ్ధపటప్రాయం బైయప్రయోజకం బయి లేనిదియుంబోలెఁ గనంబడుఁ గర్మంబులఁ జేసియుఁ బుష్కరపలాశస్థితపయోబిందువులచందంబున నిర్లిప్తుఁడై యుండుటవలన బద్ధుండు గాఁడు గావున స్వస్వరూపావస్థితియె జీవన్ముక్తి యనంబడు నాసిశ్చయం బగుట నిది పరమ

గుహ్యంబు నీ కెఱింగించితి నని చెప్పిన విని షడాననుండు పర
మానందకందళితహృదయుం డై సదాశివు నిట్లని వినుతించె. 64

తే. దేవదేవ మహాదేవ ♦ దివ్యరూప
భవ్యచారిత్ర యీశ్వర ♦ యవ్యయాత్మ
నీదుకరుణార్ద్రదృష్టిచే ♦ నిత్య మగుచు
నుండు తత్త్వంబుఁ గంటి ధ♦న్యుండ నైతి. 65

వ. అని యివ్విధంబున వినుతించి ప్రదక్షిణపూర్వకంబుగాఁ
బునఃపునఃప్రణామంబు లాచరించి యున్నంత నచ్చటఁ బురం
దరాదిబృందారకపరివేష్టితుం డై వినుచున్న విరించియుఁ దొల్లి
ప్రపంచసర్గంబుకంటెఁ బూర్వంబు మజ్జనకుం డైన శ్రీమన్నారా
యణుం డీతత్త్వంబు నాకు నుపదేశించె నని చెప్పిన సనకసనం
దనప్రముఖు లైన బ్రహ్మర్షులు విని బ్రహ్మానందభరితు లై నిజ
నివాసంబులకున్ జనిరి. 66

క. నాయనుభవప్రకారం
బీయనువునఁ జెప్పినాఁడ ♦ నిది పాటించి నయున్
బాయక పరిగ్రహింపుఁడు
ధీయుక్తి నియుక్తి నరసు♦ధీమంతులారా. 67

శా. త్రిగుణాతీత త్రినేత్రవందిత త్రిమూ♦ర్తిస్తుత్య ధీస్తుత్య స
త్త్వగుణాలంకృతవిగ్రహా త్రిజగదు♦త్పత్తిస్థితిధ్వంసకా
ర్యగరిష్ఠాత్మ త్రిశక్తిసంయుత త్రిధా♦ప్రవ్యక్తసత్యస్వరూ
పగతిస్వచ్ఛ త్రివిక్రమా త్రిపథగా♦కల్పత్రికాలస్తుతా. 68

క. నిష్క్రియ నిష్కళ నిరతా
నిష్కృతనిఖిలప్రపంచ ♦ విశ్వప విశ్వ

ద్దుష్కృతహర కౌంస్తుభసుప
రిష్కృతవక్షఃప్రదేశ ♦ శ్రీహృదయేశా. 69

మాలిని. సకలజగదధీశా ♦ సాంఖ్యయోగప్రకాశా
సకలవికలరూపా ♦ సత్యబోధస్వరూపా
ప్రకటితనిజసత్త్వా ♦ ప్రత్యగాత్మైకతత్త్వా
వికచకమలనేత్రా ♦ విస్ఫురన్నీలగాత్రా. 70

గద్య. ఇది శ్రీమద్రమారమణకరుణాకటాక్షవీక్షణాసంపద్యమాన
బ్రహ్మవిద్యాద్యశేషానుభవానవద్యగద్యపద్యకవితాచను
త్కారవిచిత్ర కటినేన్యన్వయపవిత్ర సూరయ
సుధీవరపుత్ర రామాయాహ్వయప్ర
ణీతం బైన బ్రహ్మానందచంద్రిక
యనుగ్రంథము సర్వ
మేకాశ్వాసము
సంపూర్ణము.



